ఆహార్యజా=పార్వతియొక్క, కమ్ర=మనోజ్ఞమైన,స్వాంత=మనస్సే, నిశాంత=గృహము గాఁగలవాఁడా! శాంత...కృతాంత-శాంతభయ=నిర్భయముతో, రింఖత్=చరించుచున్నవారై, దేవమర్త్య=దేవమానవులయొక్క,అంత=నాశమును, కృత్=చేసెడు ధూమ్రాక్షాదిరాక్షసులకు, కృతాంత=అంతకుఁడైనవాఁడా! తాంత...దాంత - తాంత=వాడిన, భృగురాట్=భార్గవునియొక్క, దోర్దర్ప=తేజము నెడు, మహత్=అధికుఁడైన, తామ్రాక్షు=సూర్యునికి, క్షణదాంత=ప్రాతఃకాలమైనవాఁడా! దాంతజన...మణీ-దాంతజన=ఋషిజనులయొక్క, సంత్రాణమందు, ఏక=ముఖ్యమైన, చింతామణియైనవాఁడా!.

క. కంజభవాభవచేతో,రంజన! ఖరభంజనా! నిరంజనజనజీ
వంజీవకాజవంజవ,సంజీవకచరణ నఖర చంద్రమయూఖా!. 73

టీ. కంజ...రంజన - కంజభవ=బ్రహ్మయొక్కయు, అభవ=శివునియొక్కయు, చేతః=చిత్తమును, రంజన = రంజింపఁజేయువాఁడా! ఖరభంజన=ఖరాసురసంహారియైన వాఁడా! నిరంజన...మయూఖా-నిరంజనజన=నిష్కల్మషజనులనెడు, జీవంజీవక=చకోరములయొక్క, ఆజవంజవ=సంసారమునకు, సంజీవక=రక్షకమైన, చరణనఖరచంద్రమయూఖములు గలవాఁడా!

పంచచామరము. అయాశ్రయాంధరాధరాహ్వ్రతాహితాహితాన్వితా
జయాంవ్యయా పరాపరా యసాధ్వసాహసాహసా
నయాలయా నిరాకరా సనాతనా జనావనా
దయామయా చిరాదరా సదాప్రదాచిదాస్పదా! 74

కృతికర్తృగద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందనపవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషచతుర్విధకవితానిర్వాహకసాహిత్యరసపోషణ రామరాజభూషణకవిప్రణీతంబైన హరిశ్చంద్ర నళోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

వ్యాఖ్యాతృగద్యము

ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజగోత్రపవిత్ర చిత్రకవిపెద్దిరాజతనూజ పురాతనాధునాతనకఠినప్రబంధార్థబోధనసమర్థమానసాంభోజ బుధజనవిధేయానంతయనామధేయ విరచితంబైన "హరిశ్చంద్రనలోపాఖ్యాన ప్రకాశిక" యనువ్యాఖ్యయందు సర్వంబును బంచమాశ్వాసము. శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
శ్రీ 'రామ' ప్రెసున ముద్రితము.—1930.

